## గంటలపంచాంగం

పార్థివ సం॥ వైశాఖ శు॥ నవమి
1945 సం॥ మే 20 ఆదివారం

ఆ॥ ప రా 8-56 పుబ్బ రా 1-59 వర్జ్యం ఉ 8-42 మొ 10-25 వ.

శు॥ దశమి మే 21 సోమవారం
సో॥ దశ రా 10-24 ఉఫ తె 4-7 వర్జ్యం ప 9-46 మొ 11-21 వ.

ఆంధ్రపత్రిక

ఒరుల లేయవి యొనరించిన, నరవర యప్రియము తన మనంబున కగు, దా నొరులకు నవి సేయకునికి, పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

1945-వ సం॥ మేనెల 20-వ తేది ఆదివారము

# ధర్మకర్తలు!

శాన్‌ఫ్రాన్‌సిస్కోలో ప్రస్తుతం జరుగుతున్న దేమిటి? యుద్ధానంతర నూతన ప్రపంచ విధాన నిర్ణయంకాదు. ప్రపంచ శాంతి సంస్థాపన కాదు. విశ్వ మానవ సౌభ్రాతృత్వం కాదు. చతుర్విధ స్వాతంత్ర్య ప్రతిష్ఠాపన కాదు. యుద్ధంలో తాము కొత్తగా జయించిన దేశాలనుగాని, అంతకు పూర్వం తమకు చెందివుండి శత్రు ఆక్రమణనుంచి విముక్తమైన వలస రాజ్యాలను గాని, శత్రుబారినుండి రక్షించుకోజాలిన పరాధీన దేశాలనుగాని, తమలో తాము ఏ విధంగా పంచుకోవలెనని అగ్ర రాజ్యాలు పడే తహతహ వొక్కటే శాన్‌ఫ్రాన్‌సిస్కో సభాముఖంగా వినిపిస్తూ వున్నది. మానవ హక్కులు, సమాన స్వత్వాలు; స్వాతంత్ర్యము; స్వపరిపాలనము; పరస్పరాశ్రయము; స్వయంనిర్ణయ సూత్రము, చతుర్విధ స్వాతంత్ర్యము...... అగ్రరాజ్యాధిపతుల స్వార్థపరత్వంలో ఈ శబ్దజాలానికి స్వతస్సిద్ధమైన అర్థం లుప్తమైపోయింది. చవులూరజేసే పై సిద్ధాంతాలను గురించి తుములమైన వాగ్యుద్ధం మాత్రం జరుగుతూవున్నది.

ధర్మకర్తృత్వాన్ని గురించి అగ్రరాజ్య ప్రతినిధులు కొంతవరకొక సమాధానానికి వచ్చినట్లు నేటి వార్తలు తెలుపుతున్నవి. తుదినిర్ణయ మింకా జరగవలసి వుండినా, అగ్రరాజ్యలవారికి విషయంలో అంతరాంతరాలుగ అభిప్రాయభేదా లున్నవని స్పష్టమవుతూవున్నది. పరతంత్ర ప్రజాపాలనవిషయంలో స్థూలంగా బ్రిటను అమెరికా లొకవైపు; రష్యా, చైనాలు మరొక వైపు. అమెరికా బ్రిటనుల మధ్య కూడా కొంత భేదం లేకపోలేదు. శత్రువశంనుంచి విముక్తి కాబడిన బర్మా, ఫిలిపినుల విషయంలో బ్రిటను, అమెరికాలు రెండూ ఏవిధంగా వేర్వేరువిధానా లవలంబించినవో నిన్నటి సంపాదకీయంలో వివరించే వున్నాము. అమెరికావారి విధానాన్ని అమెరికా ప్రభుత్వ కార్యదర్శి స్టెటినియస్ ఈ విధంగా వివరించాడు: "ఫిలిపీను దీవులలో మా పరిపాలనా విధానానికి మేము గర్విస్తున్నాము. ఫిలిపిను ప్రజలు జపానువారికి ప్రతికూలంగానూ, మా పక్షంగానూ పోరాడారు. త్వరలో స్వతంత్రులు కాబోతున్నారు. అమెరికావారి పరిపాలనా విధానానికిది పరమ ప్రమాణం. ఆదినుంచి అమెరికా స్వాతంత్ర్యోద్యమానికి అంకితమైన దేశం. ఎప్పుడైతే ప్రజలు స్వాతంత్ర్యబాధ్యతలను వహించేందుకూ, హక్కులననుభవించేందుకూ సంసిద్ధులూ, అర్హులూ ఔతారో, అదిమొదలుకొని తమ అభీష్టం ప్రకారం తమ్ముతాము పాలించుకునే విషయమై అమెరికా ప్రపంచంలోని యావన్మంది ప్రజల తరఫునా పాటుబడుతుంది."

ఫిలిపిను ప్రజల విషయంలో అమెరికావారు కనుపరచిన ఔదార్యాన్ని మే మిదివరకే ప్రస్తుతించాము. కాని, స్టెటినియసుగారు ప్రవచించిన సార్వజనిక సిద్ధాంతంలో ప్రధానమైన లోపమొకటున్నది. 'స్వాతంత్ర్యబాధ్యతలను వహించేటందుకు, హక్కుల ననుభవించేటందుకూ, అర్హతనూ సంసిద్ధతను పరతంత్రప్రజలు ముందుగా బడయవలెన'ని ఒక షరతును వీరు విధిస్తున్నారు. ఈఅర్హతనుగానీ, సంసిద్ధతనుగానీ నిర్ణయించగలవా రెవ్వరు? పాలితులూ, పాలకులూ కాకుండా మూడవవా రెవరైనా మధ్యవర్తులుగా వుండి నిర్ణయించే పక్షంలో పాలితప్రజల క్షేమార్థమైనా న్యాయం జరిగేటందుకు అవకాశం వుంటుంది. లేనిపక్షంలో, పాలకులు చిరకాలం పాలిత ప్రజల అనర్హతను స్థాపించటానికే ప్రయత్నించరా? ఈ విధానమే స్థిరమయ్యేట్టుంటే తోడేళ్లవల్ల గొర్రెల కెంత న్యాయం జరుగుతుందో 'ధర్మకర్తల'వల్ల పరతంత్ర ప్రజలు కంతకంటె ఎక్కువ న్యాయం లభించబోదు. బ్రిటిషు వారు అసలింతమాత్రం కూడా అంగీకరించేట్టు లేరు. అమెరికా కార్యదర్శి 'స్వాతంత్ర్య'మనే పదాన్నయినా ఉపయోగించాడు. బ్రిటిషు ప్రతినిధులు 'స్వాతంత్ర్యాని'కీ, 'స్వపరిపాలన'కూ తేడాలు తీస్తున్నారు. పరాధీన ప్రజల లక్ష్యం 'స్వపరిపాలనమే' గాని, 'స్వాతంత్ర్యం' కాదనిన్నీ, ఆ స్వపరిపాలనమైనా, క్రమక్రమంగా, వారి బాల ప్రకారమున్నూ, ఒక్కొక దేశానికి అనుగుణ్యంగా ఒక్కొక పద్ధతి ననుసరించిన్నీ అభివృద్ధి పొందవలెననీ అంటున్నారు. ఇప్పటికి కాదు, ఏనాటికి కూడా 'సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని' బ్రిటిషువారు పరాధీన ప్రజల లక్ష్యంగా అంగీకరించటమేలేదు. 'మాకున్న దానిని మేము ఎన్నటికీ వదులుకోము'ని బ్రిటిషు ప్రధానామాత్యులన్న మాటల కిది ప్రత్యక్ష నిదర్శనంగా పరిగణించవచ్చు.

బ్రిటిషు సామ్రాజ్య విధానాన్ని అమెరికనులు ఆక్షేపించకుండా బ్రిటిషువారు అమెరికా వారికి మరొక దివ్యమైన సూచననుకూడా చేసినట్టు కొత్తగా తెలుస్తున్నది. ఆత్మరక్షణ పేరిటనూ, ప్రపంచభద్రత కోసమున్నూ, అమెరికా పసిఫిక్ ద్వీపాలను కొన్నిటిని జపాను చేతులనుంచి లాగుకొని తాను వశపరచుకొనవలసిందనీ, అమెరికావారి చర్యను తాము బలపరచగలమనీ బ్రిటిషు ప్రభుత్వం అమెరికాకు తెలియజేసిందట. అమెరికాకూడా బ్రిటనుతో చేరిన పక్షంలో అమెరికా బ్రిటనును ఆక్షేపించేందుకు అవకాశం వుండకపోవచ్చు. తక్కిన విషయంలో ఎలాగైనా, ఈ తోడు దొంగల పద్ధతిని రష్యా, చైనాలు సమ్మతించవని వూహించవచ్చు. పరతంత్ర ప్రజలందరకూ స్వాతంత్ర్యం, స్వయం

# ఫ్రిస్కో సభ: మిత్రమండలి వివాదలు

## కాలనీలకు స్వాతంత్ర్యం: రష్యాచైనాల పట్టుదల

శాన్‌ఫ్రాన్సిస్కో, మే 18: వలస రాజ్యాల విషయములో ధర్మకర్తృత్వాధికారమును మాత్రమే సామ్రాట్ దేశాలు వారు వహించవలెననియు, కాలక్రమేణ ఆ వలసరాజ్యాల ప్రజలకు స్వపరిపాలనాధికారమును యివ్వవలెననియు ఒక అభయహస్త ప్రకటన చేయవలెనని శాన్ ఫ్రాన్సిస్కో సభయందు అయిదు పెద్దరాజ్యాలవారు కలిసిచర్చించారు. కాలనీలకు స్వపరిపాలనాధికారం యిస్తామని ప్రకటిస్తే చాలునని అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సులు వాదించినవి. కాలనీలకు స్వాతంత్ర్యం యిస్తామని ప్రకటించుట అవసరమని రష్యా చైనాలు వాగిస్తున్నాయి. స్వాతంత్ర్య ప్రకటన కూడా చేయవలెననే షరతు విషయమై రష్యా చైనాలు పట్టుదల వహించకుండా ఉన్నట్లయితే ధర్మకర్తృత్వ మండలిలో రష్యా చైనాలను కూడా చేర్చుకుంటామని అమెరికా ఇంగ్లాండు ఫ్రాన్సులు అన్నాయి, ఈ పెద్ద రాజ్యాలు అయిదింటికి త్వరలోనే సమాధాన యేర్పడవచ్చునని యిచటి అధికార ప్రముఖులు గట్టి నమ్మకంతో ఉన్నారు.

ప్రపంచశాంతి అనేది వివిధరాజ్యాల స్వాతంత్ర్యంవల్ల ఏర్పడదనిన్నీ వివిధ రాజ్యాల సమాశ్రయ తంత్రంవల్లనే ఏర్పడగలదనిన్నీ అమెరికాప్రభుత్వం వాదించుచున్నది.

### అమెరికా విదేశాంగకార్యదర్శి ప్రకటన

అమెరికా విదేశాంగ కార్యదర్శి యగు స్టెటినియసుగారు యిలా అన్నారు:—

ధర్మకర్తృత్వాధికారమును ఏ రాజ్యం విషయంలో వహిస్తామో ఆ రాజ్యానికి కాలక్రమేణ స్వాతంత్ర్యం యివ్వవలెననే సంకల్పంతోనే పరిపాలిస్తూ ఉంటాము.

ఆ రాజ్యములోని ప్రజలు స్వతంత్ర పరిపాలనకు సమగ్రులై నప్పుడు వారికి స్వాతంత్ర్యం యివ్వబడును.

కాని, యీ ఆధునిక ప్రపంచంలో అన్ని రాజ్యాలవారు పరస్పరాశ్రయం వల్ల ఎక్కువ సౌఖ్యంగా భద్రంగా కాలక్షేపం చేయుటకు వీలున్నది.

ఫిలిప్పయిను దీవుల విషయం చూడండి ఆ దీవుల ప్రజలకు అమెరికా ప్రభుత్వం స్వపరిపాలనాధికారం యిచ్చింది.

ఏ ప్రాంతం విషయంలో ధర్మకర్తృత్వాధికారం వహిస్తామో ఆ ప్రాంతవాసులను రాజకీయంగా సాంఘికంగా వృద్ధిలోనికి తీసికొని రావలసిన బాధ్యతకూడా నిర్వహించవలసి ఉన్నది.

### అంతర్జాతీయ న్యాయవిచారణసభ

ఇప్పుడున్న అంతర్జాతీయ న్యాయవిచారణసభకు బదులుగా మరొక న్యాయవిచారణ పీఠమును యేర్పాటు చేయవలెనని నేడు ఫ్రిస్కోసభలో ఆవ్యవహార సంబంధమైన కమిటీ నిర్ణయించింది. ఈ కమిటీకి యీజిప్టువారు విదేశాంగమంత్రియగు కోమిలో ఎన్నిక్యాబ్ గారు అధ్యక్షులు.

ప్రపంచశాంతి రక్షణసభలో సభ్యత్వము వహించెడి దేశాలన్నియు శాంతి రక్షణకు సైనిక చర్యలను జరుపుటకు సిద్ధముగా ఉండవలెననే షరతు ఫ్రాన్సు ప్రతినిధి ప్రతిపాదించారు. అందువలంగా స్విడ్జర్లాండున్నూ ఐర్లాండున్నూ యీ ప్రపంచ శాంతిరక్షణ సభలో సభ్యరాజ్యాలుగా చేరజాలవు. ప్రపంచ శాంతి రక్షణసభతో సంబంధంలేకుండా తటస్థరాజ్యాలుగా వుండే ఇతర రాజ్యాలు ఉండేటట్లు నిర్ణయించరాదని రష్యా పట్టుదల వహించుచున్నది.

దురాక్రమణకై దండయాత్రగాని వ్యగ్రచర్యలుగాని జరిపెడి రాజ్యమును ఎట్టిదో నిర్వచింపబడవలసి యున్నది. వ్యగ్రచర్యలవగా ఎట్టివో భద్రతాసంఘమే వారే నిర్వచించవలెనని ఎన్నిక్యాబ్ గారు అన్నారు. వ్యగ్రచర్యల ఉదాహరణ జాబితా తయారుచేయబడవలెను. అట్టి వ్యగ్రచర్యలు జరిపిన దేశాల విషయంలోనే భద్రతా మండలి ప్రతీకారములను జరపబూనుకొనును. సైనిక చర్యలను జరుపుటకు పూర్వం సామ్యంగా తగాదా పరిష్కారమునకు ప్రయత్నము చేయబడును. సైనిక చర్యలు కాకుండా ఇతర ఆంక్షలను వర్తింపజేయుటను గూర్చి కూడా చర్చింపవలసి యున్నది. యీ ప్రతీకారచర్యల కట్టుబాటు తీర్పును

నిర్ణయ హక్కులుండవలెనని రష్యా పట్టుదలగా వాదించింది. పరాధీన ప్రజలకు రష్యా వైఖరి వొక్కటే ఆశావహంగా తోస్తున్నది.

# నాయకత్రయ సమావేశం

## బహుశా జులైలో జరుగును

### బ్రిటను అమెరికాలకు కమ్యూనిజం భయం

లండన్, మే 17: దాదాపు 10 వారాలలోగా బహుశా జులై మాసాంతమున చర్చిలు, ట్రూమన్, స్టాలిన్ గార్లు సమావేశం కానున్నారని యీదియను వార్తల వల్ల తెలుస్తోంది. ఈసభ లండనులో జరుగదనియున్నై పెద్దప్రెస్సుకు అధికార రీత్యా తెలిసింది.

అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ మొదట లండనులో చర్చిలు ప్రధానిని కలుసుకొని తరువాత యిద్దరూ స్టాలిన్ తో సంభాషణలకై మాస్కో వెళ్తారని న్యూయార్కు వార్తలు సూచిస్తున్నాయి; ఇదియే బహుశా నాయకత్రయం కడపటి సమావేశం కావచ్చు. జర్మనీని బందోబస్తుగా పాలించడము, జర్మనీలో మిత్రదేశాల ఆక్రమణ మండలాలు నిర్ణయించడం ఈసభలో ఆలోచింపబడును.

స్టాలిన్‌ను కలుసుకొని మాట్లాడాలని ట్రూమన్, చర్చిల్ గార్లు ఆదుర్దా తెలుపుతున్నారు. కాని స్టాలిన్ మాత్రం తన మనస్సును యింకా ప్రపంచానికి తెలుపకున్నాడు. యూరోపు దేశాల రాజకీయ పరిస్థితి చిక్కగా నున్నదని లండనులోను వాషింగ్టనులోను నమ్మబడుచున్నది. స్టాలిన్‌తో యూరోపు రాజకీయ ఆర్థిక సమస్యలను చర్చించుటకు ముందుగా ఫ్రిస్కోసభలో ప్రపంచభద్రతా సమస్యల పరిష్కారం జరగడం మంచిదని ట్రూమన్ చర్చిల్ గార్లు అనుకొంటున్నారు.

జర్మనీని ఓడించడమే మిత్రరాజ్యాల సమష్టి సంకల్పముగా నుండినది. జర్మనీ ఓడిపోవడంచేత మిత్రరాజ్యాలను ఏకీభవింపజేసే ఆ సమష్టి సంకల్పం తొలగిపోయింది. యూరోపులో సోవియటు యూనియను హెచ్చుచున్నందుకు బ్రిటిష్ రాజకీయనేతలు తమకు కలుగుతున్న దిగులు కప్పిపుచ్చలేకున్నారు. మాస్కోనుండి మాడ్రిడ్ వరకును యింకా ఆవల కూడా నురష్యా సుత్తి కొడవలి పతాకాలు ఎగురగలవని వారు భయపడుతున్నారు.

రష్యా ఎత్తులను కొంత అడ్డగించాలనే తలంపుతోనే ట్రీస్టీని వదలమని యుగోస్లావు నాయకుడగు మార్షల్ టిటోను బ్రిటను అమెరికాలు కోరియున్నవి. మార్షల్ టిటో కమ్యూనిస్టుపార్టీ వాడని ఎల్లరకు తెలిసిందే. మాస్కో ప్రాబల్యం కూడా అతనికి సంపూర్ణంగా నున్నది. గనుక టిటోకు లేఖ పంపడమంటే స్టాలినుకు పంపబడినట్లే అనుకోవలెను. బ్రిటను అమెరికాల ఆమోదంలేక స్వతంత్రంగా ఎట్టి పరిష్కారం చేయవద్దని స్టాలినును యీ దేశాలు యీ విధంగా మందలించినట్లు ఎంచవచ్చును. (యు. ప్రె.)

## జూదర్ల ఎరెస్టు

తెనాలి, మే 16: కొల్లూరు గ్రామంలో 21 మంది జూదమాడుతుండగా పోలీసు డెప్యూటి సుపరింటెండెంట్, సబ్ ఇన్‌స్పెక్టరు రిజర్వు దళంతో పోయి అందరినీ పట్టుకొని రు 2500 రొఖం స్వాధీన పరచుకొని ఇక్కడి సబ్‌మేజిస్ట్రేటువద్ద చార్జిషీట్ దాఖలుచేశారు. తలా రు 200/లు జరిమానా విధించబడింది. తోట ఇచ్చినందుకు, స్వయం ఆడినందుకు స్వంతదారుకు రు 400 జరిమానా విధించారు. ఇద్దరు మాత్రం నేరం ఒప్పుకోనందున వారివివాద కేసు జరుగుతున్నది.

అంతర్జాతీయ మండలిలో ఎవరు ధరించవలెను. అనే విషయంకూడా చర్చించాలి.

### మానవులందరికి సమాన పౌర హక్కులు

ఆర్థిక సాంఘిక సాహచర్య కమిటీ విధానమును నిర్ణయించుటకై ఫ్రిస్కో సభవారు ఏర్పాటుచేసిన కమిటీకి అధ్యక్షులైన సర్ ఏ. రామస్వామి మొదలియారుగారు తమ నివేదికను దాఖలు చేశారు.

సర్వమానవ సమానహక్కు స్వాతంత్ర్యములను వృద్ధిచేయవలెననే ధర్మనిర్వచనము డంబర్టను ఓక్సు ప్రణాళికలో ఉంది. కాని ఆ ధర్మనిర్వచనమును యీ కమిటీ తిరిగి సంస్కరించి వ్రాసింది. సమాన హక్కు స్వాతంత్ర్యములను జాతి విచక్షణ లేకుండా అన్ని రాజ్యాలవారు తమదేశాలలో విధిగా కలుగజేయుటకు నిర్బంధించగల నిబంధన ఏమైనా ఉన్నదా అని రామస్వామి మొదలియారుగారిని ప్రశ్నింపగా అట్టి దేదియు ఇంతవరకు లేదన్నారు కాని, అట్టి సమాన స్వాతంత్ర్యమును తమ దేశాలలోని ప్రజలకు కలుగజేయగలవారము అని అన్ని రాజ్యాలవారు ప్రమాణం చేయవలసి యుండునని ఆస్ట్రేలియా ప్రతినిధి ఒక సవరణ తీర్మానమును ప్రతిపాదింప సిద్ధంగా ఉన్నదన్నారు.

# రాష్ట్రాలలో కూడా కార్యవర్గ పాలన?

1 వ పేజీ తరువాయి

సర్ పి. రామస్వామి, సర్ నూన్, సర్ కిజిస్లెక్ దళాల్ గారలు ఇదివరకే వెళ్లిపోయారు.

అంబేద్కర్ గారు బొంబైలో, డా॥ ఖరేగారు నాగపూరులో, సర్ బెంథాలు కలకత్తాలో, జోగేంద్రసింగ్ సిమ్లాలో వున్నారు. సుల్తాన్ అహమ్మద్ గారు గతరాత్రి సిమ్లాకు వెళ్లారు. మోడీ, అజీజుల్ హక్ గారలు సిమ్లాకు ఈ రాత్రి, అశోక రాయ్ గారు రేపు రాత్రి, శ్రీవాత్సవగారు వచ్చే వారమూ వెళ్లనున్నారు. వైస్రాయి కౌన్సిల్లీ కూడా వచ్చే వారం ప్రారంభములో సిమ్లా వెళ్లవచ్చు.

ఆర్థిక సభ్యుడు రోలెండ్స్, సర్ మహమ్మద్ ఉస్మాన్ గారలు మాత్రం ఇక్కడ వుంటారు. ఆర్థిక సభ్యుడు రోలెండ్సు మాట ఎలావున్నా సర్ మహమ్మద్ ఉస్మాన్ మాత్రం ఇక్కడే వుంటాడు. వైస్రాయి వేవెల్ ప్రభువు ఇప్పటప్పట్లే తిరిగి రాబోవడం లేదనడానికి ఇదొక నిదర్శనంగా భావింపబడుచున్నది. వేవెల్ ప్రభువు ఎప్పుడు తిరిగి వస్తాడో ఎవరికీ తెలియదు.

ఈపరిస్థితిఅంతా ఇలావుండగా, బర్మా రాజ్యాంగ భవిష్యత్తుకు సంబంధించిన "వైట్ పేపర్" వెలువడింది. బర్మా భావి రాజ్యాంగాన్ని, బర్మనులే తయారుచేసుకోవాలంటున్నారు కాబట్టి బర్మసమస్యకూ భారతసమస్యకూ సామ్యం నిరూపితమైంది. భారతదేశంలో 93 వ సెక్షను మాదిరిగా బర్మాకుకూడా ఒక సెక్షను ఏర్పాటైంది. ఇది ఢిల్లీ వర్గాలలో నిరాశాభావం రేకెత్తించింది. ప్రస్తుతం 93 వ సెక్షను అమలులోవున్న రాష్ట్రాలలో వైస్రాయి తిరిగివచ్చి కార్యవర్గ స్థాపనకు బూనుకోవచ్చు. వివిధ భారతవర్గాల ఏకీభావ ప్రాధాన్యాన్ని గురించి మరొకసారి ప్రసంగించవచ్చు.

# జపాన్ సంధిసూచన

(1-వ పేజీ తరువాయి)

లొంగుబాటు సూత్రంలో తమకు అనుకూలించే లోపం ఏదైనా వున్నదా అని బహు తాపత్రయపడి పరిశోధిస్తున్నారు. మనిలానగర పతనంతో, ఓకినావా దండయాత్రలో జపాను పైని వేటు వర్గాలద్వారా సంధిప్రతిపాదనలు ఎక్కువైనవని ఇక్కడి రాజకీయవర్గాలవారు అభిప్రాయపడుతున్నారు. అమెరికనుల ఉద్దేశాలు ఏవిధంగావున్నదీ తెలుసుకోడానికి మాత్రమే ఇల్లాంటి సంధిపాచికలనువేసి చూస్తున్నారు.

జపాను స్పష్టమైన శాంతి ప్రతిపాదనను పంపించిందనే వార్తను ఇక్కడి వున్నతాధికారులు నమ్మడంలేదు.

## చైనాతో సంధికి జపాన్ తాపత్రయం

లండన్, మే 19: జపాన్‌వారు సంధి విషయమై కదల వేసింది ఒక్క అమెరికానే కాదనీ, మాస్కోలోని జపాన్ రాయబారి అక్కడి చైనా రాయబారితో సంప్రతించడం ప్రారంభించాడనీ 'డెయిలీ టెలిగ్రాఫ్' పత్రిక వార్తా విలేఖరి వ్రాశాడు.

చైనాతో సంధి ప్రస్తావన పచ్చ రంగువారందరూ ఒక్కటిగా వుండాలన్న సిద్ధాంతంతో జరిగింది.

ఈ సంగతి రాజకీయవర్గాలనుంచే తెలిసింది. ప్రాచ్యంలోని కొన్ని ప్రాంతాలలో జపాను ఆధిపత్యాన్ని చైనా అంగీకరించాలనీ, ఆ పక్షంలో తాను చైనా భాగాలను ఖాళీచేసి, చాంగ్ కై షేక్‌తో వెంటనే స్నేహ ఒడంబడిక చేసుకొంటామనీ కూడా జపానువారు సూచించారట. మార్షల్ చాంగ్ కై షేక్, ఈ ప్రతిపాదనలను మొట్ట మొదటే తోసిపుచ్చాడట.

## గౌతమీ విద్యాపీఠం

రాజమండ్రి, మే 15: శ్రీ గౌతమీ విద్యాపీఠంవారి సంగీతశాఖ కమిటీసభలు మే 1 వ 13 వ జరిగినవి. నెలకొకసారిగాని, రెండునెలలకొకసారిగాని గానసభలు జరపటానికి తీర్మానించారు. ఈ సంగీతశాఖకు సహాయంగా స్థానికసంగీత విద్వాంసులనందరినీ ఒక కమిటీని ఏర్పాటు చేశారు. బి. ఎస్. లక్ష్మణరావు, రామచంద్రపురపు వెంకటరత్నం, ఖండవల్లి జనార్దనాచార్యులు గార్లను పైకమిటీకి కార్యదర్శులుగా ఎన్నుకొన్నారు. సంగీతపాఠశాల విషయమై తగు ఏర్పాట్లు చేయడానికి సంగీతశాఖవారిని కోరారు.

### వ్యాయామ కళాశాల

కృష్ణాజిల్లా పోలీసు డిప్యుటి సుపరింటెండెంటు, గుడివాడ సర్కిల్ ఇన్‌స్పెక్టరు వానపాములలోని ప్రొఫెసర్ రాజగోపాలుగారి వ్యాయామ కళాశాల సందర్శించి అలాటి వ్యాయామసంస్థలు ప్రతి గ్రామంలోను పెట్టి వృథకొయులను తయారు చేయవలెనన్నారు. గోపాల్ గారి కృషిని ప్రశంసించారు.

# పరాధీన ప్రపంచ భద్రత

## పీటర్ ఫ్రేజరు నిర్ణయము

[ఫ్రాంక్లిన్ డే]

శాన్‌ఫ్రాన్సిస్కో, మేనెల 15-న్యూజీలాండ్ ప్రధానామాత్యుడు పీటరు ఫ్రేజర్ సోమవారమునాడు మిత్రరాజ్య సమావేశములో పరాధీన దేశధర్మకర్తృత్వమును గురించి ఆలోచించవలసిన విషయాలను చెప్పినాడు.

పరాధీన దేశధర్మకర్తృత్వ సంఘ సభ్యులందరున్నూ పరాధీనదేశాలలో ఉన్న ప్రజల శ్రేయస్సును గురించి అత్యంత శ్రద్ధతో ఆలోచిస్తున్నట్లు ఆయన చెప్పినాడు. ఇందుకు అందరున్నూ హర్షించినారు.

ఈ ధర్మకర్తృత్వ విషయములో ఆయువుపట్టుగా ఉన్న ప్రదేశాలలో ఒక రకమైన రాజ్యనిర్వహణ పద్ధతిని ఆయువుపట్టు కాని ప్రదేశాలలో మరొక రకమైన రాజ్యనిర్వహణ పద్ధతిని గురించిన విషయము అందరినీ ఆకర్షించింది. అంతేగాకుండా సెక్యూరిటీ కవున్సిల్‌వారి అధీనములో ఉండే పరాధీన దేశాలలో ఒకమాదిరి రాజ్యనిర్వహణ పద్ధతియున్నూ జనరల్ ఎసెంబ్లీ అధీనములో ఉండే పరాధీన ప్రదేశాలలో మరోమాదిరి రాజ్యనిర్వహణ పద్ధతియున్నూ సరిసమాన ప్రతిపత్తితో ఉన్న దేశాలయినప్పటికి అమలుపరచవలెనని అన్నప్పుడు ఆపభాగాన్ని గురించి అనేకవిధములయిన ఆలోచనలు బయలుదేరినవి.

పోటికిలోడు పూర్వము లీగు ఆఫ్ నేషన్సువారి ప్రాజాపత్యములో ఉన్న పరాధీన దేశాలలో యిప్పుడు మిత్ర రాజ్యాల ధర్మకర్తృత్వము క్రిందికివచ్చి కొత్త పద్ధతిన రాజ్యనిర్వహణము సాగే సందర్భములో ఆయా దేశాల రాజకీయ నైతిక సమస్యలనుగురించి రకరకాల ఆలోచనలూ పుట్టినవి.

### అసలువిషయం

ఇన్ని విధాల ఆలోచనలలోనూ అసలు విషయము- పరాధీన దేశ ప్రజాశ్రేయస్సును గురించి - అందరూ మరిచిపోయినారు. అయితే ఆయాప్రభుత్వాల ప్రతినిధులు మాత్రము ఈ విషయము మరచిపోలేదని ఫ్రేజరుచేసిన ప్రకటనమువల్ల రుజువుఅయింది ఆయనచేసిన వాగ్దానాలవల్ల ధర్మకర్తృత్వము అంగీకరించదలచిన రాజ్యాలవారు ఆయాపరాధీన దేశాల రాజకీయాలకన్నా ప్రజాశ్రేయాన్నే ప్రజల హక్కులనే ఎక్కువగా పాటిస్తూన్నారని తెలిసింది.

పరాధీనదేశాల ధర్మకర్తృత్వ విషయములో అభిప్రాయభేదాలు ఉన్నప్పటికిన్నీ ప్రజాశ్రేయస్సును గురించి కమిటీ సమావేశములో ఫ్రేజరు విపులంగా వివరించినాడు. పరాధీన దేశప్రజా శ్రేయమును గురించి విరుద్ధాభిప్రాయాలులేవు. అంతేకాదు. అంతర్జాతీయ ధర్మకర్తృత్వ విషయములోనూ అభిప్రాయభేదాలులేవు.

### ప్రాథమిక ధర్మనిర్ణయము

ఆయా ప్రత్యేక దేశాలస్థితినిగురించి ఈ కమిటి విచారించదు అనిన్నీ ప్రధానామాత్యుడు ఫ్రేజరు చెప్పినాడు. ముందుగా "ప్రాథమిక ధర్మము" నిర్ణయముచేసి. ఆయాపరాధీన దేశాలు ఆయువుపట్టుల లాంటివి అయినా కాకపోయినా ధర్మకర్తృత్వములోకి వచ్చినా రాకపోయినా అన్వర్తించేట్లు చేయడమే ఈ సమావేశము వారి విధ్యుక్తధర్మము అనిన్నీ చెప్పినాడు.

మిత్రరాజ్యాలవారు నిర్ణయించే ఆయా దేశాలలో ధర్మకర్తృత్వ సంబంధమయిన సమస్యలనుగురించి ఒక నిర్ధారణ జరుగుతుంది.

### అమెరికాధోరణి

ఈ సందర్భంలో అమెరికా సంయుక్తరాష్ట్రాల ప్రతినిధులు ధర్మకర్తృత్వ విషయములో ఏ ప్రత్యేక ప్రదేశాన్ని గురించీ చర్చించలేదు. ప్రపంచములో ప్రతిప్రాంతములోనూ అందరి హక్కులను కాపాడడమే అమెరికావారి ఆశయము అని యుద్ధమునకు పూర్వమువారు అవలంబించిన పద్ధతివల్ల తెలుస్తూ ఉంది; గామ్ ద్వీపములో అమెరికా నావికాశాఖా ప్రభుత్వమువారు అవలంబించిన విద్యావిరోగ్యము పారిశుధ్యము సాంఘికశ్రేయస్సు రాజకీయాభివృద్ధి మొదలయిన విషయాలలో అవలంబించిన పద్ధతులనుంచి ఆ ద్వీపవాసులు అమెరికనులను యెంతో ప్రేమించి గౌరవించినారు. జపానువారు మూడు సంవత్సరాలు విశేషప్రయత్నము చేసినా అమెరికా స్వాధీనములో నుంచి ఆ ద్వీపాన్ని తప్పించలేక పోయినారు.

## మహబూబు ఆలిబేగ్‌గారు

### కేంద్ర శాసనసభకు ఎన్నుకొనబడిరి

బెజవాడ, మే 18: మహబూబు అలి బేగుగారు (ముస్లిములీగు) కేంద్ర శాసనసభకు, ఉత్తర మదరాసు మహమ్మదీయ నియోజక వర్గమునకు పోటీ లేకుండా ఎన్నుకొనబడిరి.

